శ్రీరస్తు.

# సుబుద్ధిశతకము.





ఇది

మణిమంజరినాటకము, కొండవీటిచరిత్ర

మొదలగు గ్రంథముల కర్తయగు,

## ఖాసీం ఆలీషాచే

రచియింపఁబడి

గుంటూరు కన్యకా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

 1924 [వెల 4 అణాలు.

శ్రీరస్తు.

# సుబుద్ధి శతకము



ఇది

మణిమంజరినాటకము, కొండపేటచరిత్ర

మొదలగు గ్రంథముల కర్తయు,

గుంటూరు తా॥ గొరవాడిగ్రామనివాసుఁడునగు

ఖాసీం అలీషాచే

రచియింపఁబడి

గుంటూరు కన్యకా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది



 1924 [ వెల 4 అణాలు.

# అంకితము

సీ॥ భక్తాగ్రగణ్యులు ప్రహ్లాదసన్నిభుం
డంచు నెవ్వాని నుతించుచుంద్రు
మహీభిషఙ్మణిశిఖామణు లశ్వినీదేవుఁ
డంచు నెవ్వానిఁ గీర్తించుచుంద్రు
సకలభాషారసజ్ఞత రసజ్ఞులు బృహ
స్పతియంచు నెవ్వాని సన్నుతింత్రు
అత్మీతధర్మవిద్యానుసంధానరత ధ
ర్మజుఁడంచు నెవ్వాని మహిభజింతు

తే॥ ఇట్టి చతురుండు, వేదవిద్యాపరుండు,
ప్రథితసత్కీర్తి, సూనృతవ్రతగరిష్ఠుఁ
డమలగుణశాలి, మౌలాలియనెడు నాదు
తండ్రి కీకృతి నే సంకితం బొనర్తు॥

గారపాడు,
5-4-24.

ఇట్లు అనుంగుపుత్రుఁడు,
ఖాసీం అలీషా.

# సుబుద్ధి శతకము.



క॥ శ్రీమహిళామణి త్రిజగ
ద్ధామోదరు ప్రణుతమణియు దైవగణపురం
ధ్రీమణి దుగ్ధాబ్ధికుమా
రీమణి రమ నిన్నుఁ గనికరించు సుబుద్ధీ! 1

క॥ భువి దివి సర్వగ్రహ వా
ర్ధివమహాచలసూర్యమాతరిశ్వాదుల నే
ప్రవరుఁడు సృజించె నాభూ
క్షపుని బరాత్పరుని బరుని దలఁతు సుబుద్ధీ!

క॥ ద్వ్యక్షరి, పంచాక్షరి, య
ష్టాక్షరిమంత్రముల కెవ్వఁడనుకూలుఁడో యా
యక్షరుని సర్వలోకా
ధ్యక్షుని దక్షుని నుతింపు మనని సుబుద్ధీ! 3

క॥ సనకాదులైన భక్తిం
గని తొలి కార్యానుకూల్యఘటనార్థం బే
యనిమిషుని గొల్తు రల నా
గణనాథు నుతింపవలయుఁగాదె సుబుద్ధీ! 4

క॥ రసవాగ్రచనలకై స
ద్రసపేశలమాధురీనిరంకుశ భాషా
రసికత్వమునందుఁ గుశలత
నొసఁగన్ భారతిని గొల్వ ముద్దు సుబుద్ధీ!

క॥ కందంబులు సుకవీశుల
కందంబు లమందసుందరాబ్జాస్యలకున్
గుందంబులు బుధకర్ణా
నందంబు లటంచు వ్రాసినాఁడ సుబుద్ధీ! 6

క॥ జిలిబిలిముద్దులు గులుకెడు
తెలుఁగుపదంబుల వెలుంగు తియ్యనిపద్యం
బులు సులభశైలి నుండిన
గలుగునుగద తుష్టి బాలికలకు సుబుద్ధీ! 7

క॥ వ్రాసితి నీపద్యంబుల
నీసువహింపంగఁ బోకుఁడీ తప్పిద మెం
తేసికి వీప్రమునికే గా
నీ సహజము వేఱెఁ జెప్పనేల సుబుద్ధీ! 8

క॥ అల్లనఁ దెలుఁగుకవిత్వం
బల్లియుఁ గవయిత్రి యగు మహాగౌరవముం
బెల్లుగఁ గాంచినకుమ్మరి
మొల్లకు జోహారు లిడుదు మొదట సుబుద్ధీ!

క॥ తరుపరి, పూర్వకవీంద్రుల
పదశతపత్రముల కేను ప్రణుతు లొనర్తున్
మది నెంతు నేఁటికవులను
సది కవి కాచారమగు నటంచు సుబుద్ధీ ! 10

క॥ అత్తను గులదేవతగా
నుత్తముఁడగు మామ నెప్పు డుర్వీంద్రునిగా
బత్తిని సేవించెడిసతి
సత్తమురాలి యటండ్రు సకలజనులు సుబుద్ధీ !

క॥ ఉదయమున లేచి నాథుని
వదనాబ్జముఁ గాంచి పిదప పరభక్తిని ద
త్పదములు విడువక కొల్చిన
నదిరా సౌభాగ్యవతి యటండ్రు సుబుద్ధీ !

క॥ జనకజ యల్లకుముద్వతి
యనసూయ యరుంధతీముఖాబ్జేక్షణ లే
పను లాచరించి సద్గతిఁ
గనిరో తత్క్రమ మెఱుంగ ఘనము సుబుద్ధీ !

క॥ ధీరుల సేవించుటయున్
నేరుపుతో వరుసియాజ్ఞ నెరవేర్చుటయున్
సారెకు హరిఁ గొలుచుటయున్
నారీమణి కిది సులక్షణంబు సుబుద్ధీ ! 14

క॥ ఆడిన నెపమాడుచుం గొ
ల్లాడినఁ బతితోఁ బ్రగల్భలాడి మనెడునా
యాఁడుది యాఁడుదిగా దర
గాడిదరా యందు రెల్లఘనులు సుబుద్ధీ! 20

క॥ ఇమ్మగు పరువమ్మందునఁ
గ్రొమ్మించులవలెఁ జరించుగుడుచేటుల కా
యిమ్ము వినాశమ్మైనను
దమ్మిడి సేయంగనైనఁ దగునె సుబుద్ధీ! 21

క॥ పతికిన్ సుతులకు నిడి తా
గతికిన సంగతుకకున్న యన్న మనుకొను నా
సతికిన్ స్వర్గము మోక్షము
సతులిల సౌభాగ్యము లగుఁడు సుబుద్ధీ!

తే॥ పలుదోమ కొండలు దోమక
వలువలు వోమకయ యొద్దెవర్తన మొనరన్
గడువే కైలాసముగా
నిల బ్రతుకుటకంటె నీచమేమి సుబుద్ధీ! 23

క॥ చీఁకటిఁ బాపంగ దివ్వెయు
నాఁకలి విపదంబుఁ బాప నమృతము లేమిన్
శోకాపఁ గృహిణియు నాథుని
వ్యాకులత నడంప సతియు నగును సుబుద్ధీ!

క॥ రచ్చల కెక్కకు మెప్పుడుఁ
గచ్చుకుఁగాల్ దువ్వి తోడికాంతాతతితో
మచ్చరివై మెలఁగకుమీ
మెచ్చులకై యదరకుంట మేలు సుబుద్ధీ!

క॥ దారిద్ర్యంబున బంధులఁ
జేరకు తద్బంధువులను జేరుటకన్నన్
ఊరూరఁ గొంపకొంపల
వారక బిచ్చంబు లెత్తవచ్చు సుబుద్ధీ! 26

క॥ యాత్రలసేవల కేగుచు
గాత్రముఁజెడఁగొట్టికొనుట ఘనమా కించి
న్మాత్రము పరమాత్మ నెదన్
స్తోత్రం బొనరింప ముక్తిదొరుకు సుబుద్ధీ!

క॥ ఒడెమున్నను మిక్కిలివం
గడమున్నఁ గరంబు సోయగంబదియున్నన్
నడవడిఁజెడుగై మనుచో
గడఁజూతురు నీచజాతికరణి సుబుద్ధీ! 28

క॥ బికిరం బెత్తెడివారల
వికలాంగుల హీనజనుల వెడఁగులఁగని నీ
వకటా పరిహాసము చే
యకుమా! భగవత్ప్రయత్న మగ్గి సుబుద్ధీ!

క॥ మంచియుఁ జెట్టయెఱుంగని
కొంచెపుతుంటరులతోడ గుణహీనులతో
వంచితబుద్ధులతో నెపు
డించుక స్నేహంబు సలుప కీవు సుబుద్ధీ! 30

క॥ వినవలెఁ బెద్దలనీతులఁ
గనవలె నిర్భాగ్యజనులఁ గనికర మలరన్
మనవలె సమయోచితముగఁ
గొనవలె సద్యశము పతినిగొల్చి సుబుద్ధీ!

క॥ ఉండియు లేమిడి కావడి
కుండ లటంచును వచింత్రు గుణౌఘ లక్షం
బుండిన నలరకుమా లే
కుండినఁ జింతిల్లఁబోకు ముర్వి సుబుద్ధీ! 32

క॥ వెన్నెల కొన్నాళ్ళటుపైఁ
గ్రన్ననఁ జీకటి యొసంగుకరణి నెలంతల్
కొన్నాళ్ళు కష్టమొందినఁ
గొన్నాళ్ళైనను సుఖంబుగొందురు సుబుద్ధీ!

క॥ తనయూరివారితోడను
దనపరిచారికలతోడఁ దనబాంధులతో
ననయము పగఁగొనియుండిన
ధనపతిసతికైన యశము దఱుగు సుబుద్ధీ!

క॥ లక్షణ మెఱుఁగనికవితము
శిక్షలఁ బెఱుఁగనిపడంతిశీలం బిలలోఁ
భిక్షాటనంపుజీవన
మక్షయమగునింద కిరవు లగును సుబుద్ధీ!

క॥ లయ మెఱుఁగనిసంగీతము
ప్రియమెఱుఁగనితిండి తండ్రిపెట్టినయమ్మున్
వ్యయ మెఱుఁగనిడంబంబును
నియమం బెఱుఁగని నెలంత నెఱియ సుబుద్ధీ!

క॥ కవి కీనివానిత్యాగముఁ
బవరమునం బారిపోవుబంటుతనంబున్
ధవుఁ డొల్లనిసతిజన్మము
భువిని నిరర్థకతఁ గాంచుఁ బొమ్ము సుబుద్ధీ! 37

క॥ విడువకు సద్గుణపుంజము
లడుగకు మంతనము లెవరి నైన
నుడువకు మేకాంతంబుల
నుడు లెవ్వరి కైన; దాన నొగులు సుబుద్ధీ!

క॥ నీతిస్థిరులగు పెద్దల
వ్రాఁతలు వేదములుగాఁగ వంచకకృతులౌ
వ్రాఁతలు బూతులుగా మది
నాఁతలు దలపోయుటే ఘనంబు సుబుద్ధీ!

క॥ లాతులు భ్రాతలుగా స్వ
జ్ఞాతులధనధాన్యముల్ విషప్రాయముఁగా
నేతరి సన్యార్థంబులు
రోతలుగా నెంచుమత మెఱుంగు సుబుద్ధీ!

క॥ రమ్మని పిల్వని పేరం
టమ్మునకున్ శాత్రవసికటమ్మునకున్ స
ఖ్యమ్మె సఁగనట్టిబంధు
త్వమ్మున కేనాఁడుఁజనఁగవలదు సుబుద్ధీ!

క॥ తనయందముఁ దనచందముఁ
దనదాతృతఁ దనయశంబుఁ దనగౌరవముల్
జనులకుఁ దగుఁ దగఁ బొగడఁగఁ
దనుదానే పొగడుకొంట తగదు సుబుద్ధీ!

క॥ పడుచుందనమునఁ దొడఁబడి
మిడిసిపడిచరించి క్రిందుమీఁదెఱుఁగనిచోఁ
గడ కాయమపురిలో నా
చెడుగుమదండమునదుముఁడుచెందు సుబుద్ధీ!

క॥ గడననిమిత్తము తెగఁబడి
చెడిపెంపుసమునఁ గోలంబుఁ జెఱచుటకన్నన్
మెడబండతోడ బావిని
బడిచచ్చుట మేలుగాదె పరగ సుబుద్ధీ! 44

క॥ కడదేశ మరుగవచ్చును
సిడుములఁ గొంగత్తి బిచ్చమెత్తఁగవచ్చున్
వడి విడువవచ్చు నసురులఁ
జెడి బ్రతుకుటకంటె లేదు చెఱుపు సుబుద్ధీ!

క॥ వెలి పెఱుఁగక, చెలి పెఱుఁగక,
పరమెఱుఁగక, బ్రతుకఁజూచు బ్రతుకొక బ్రతుకా?
చిరకాల ముండదే యిలఁ
గరటంబది యేమి సార్థకంబు సుబుద్ధీ! 46

క॥ విటుఁ డెంతరసికుఁడైనను
విటకత్తియ యెంత నేర్పువెలఁదుకయే, నె
న్నటికేని దద్దురాకృతి
తటుకునఁ జెడఁగాని నిల్వఁదరమె సుబుద్ధీ!

క॥ శిలకును శైలంబున కీ
యిల దోమకు నేనుఁగునకు నెంతయొడంబో
కులకాంతకు వెలకాంతకుఁ
గలయంతర మంతకన్న గనుము సుబుద్ధీ! 48

క॥ కూలికి నాలికిఁ జనుగ
య్యాళికి షడ్గుణగణంబు లలవడఁగలవా?
గాలికి విడిచినపట మది
యేలోకముఁ జనునొ! యెవ్వఁ డెఱుఁగు సుబుద్ధీ!

క॥ మెతుకిడు నెడఁ దల్లివలెన్
రతి రతిబలెఁ, బనుల దాసిక్రమమున, గృహసం
గతులందు మంత్రివలెనే
పతియెడ సతి మెలఁగవలయుఁ బరగ సుబుద్ధీ!

క॥ చెంగులు చీరాడఁగ బల్
ఖంగునఁ గాల్గజ్జెలెల్ల ఘులుఘుల్లురనన్
బొంగుచు భోగాంగనవలెఁ
జెంగునఁ జెంగునను నడువఁ జేటు సుబుద్ధీ!

క॥ తనవారికంటె ముందుగఁ
దినరా దేవస్తువైనఁ దిననేర్చినచో
నినుబోతని మనుబోతని
తినుబోతని లోకమెల్లఁ దెగడు సుబుద్ధీ! 52

క॥ తనవలెఁ గనవలెఁ బ్రాణుల
నెనయక కాఠిన్య, మది యహింసాధర్మం
బనవలె నదియే స్వర్గం
బనవలె వినుమీ సునీతి నవని సుబుద్ధీ! 53

క॥ ఘటమువలెన్ జటుపాటిఁజను
ఘట మిది శాశ్వతముగాదు గావున సత్యా
త్కటమగు భవవనధిని సం
కటములఁ బడనేల ముక్తిఁగనుము సుబుద్ధీ!

క॥ పరువమున బుద్ధి తోరతోరఁ
బరుగిడితోడు దానితోడఁ బరుగిడఁదరమా ?
కరువలికైనను మురహరు
గరుడునికైనను బరంబుఁగనుము సుబుద్ధీ !

క॥ మదనుం డదయుం డంచని
వదరిరి కవివరులు చపలభావోన్మదులై
యది తథ్య మంచు నెంచకు
మతియే మన్మథుఁడు దీర్ఘమతికి సుబుద్ధీ !

క॥ తనబుద్ధి తనకువశమై
చన ముల్లోకములఁ గెల్వఁజనును సెవ్వాఁడున్
దనయింట గెల్చిగడ ర
చ్చనుగెల్వఁగఁ గడగిపోవఁజాలు సుబుద్ధీ ! 57

క॥ కామాదు లనెడు శత్రులు
లోపలిగినవారు సుమ్మీ లోఁగనుగొనుమీ
కామాదుల నిర్జించిన
రామాదులఁ జేరవచ్చు రమణ సుబుద్ధీ ! 58

క॥ మాయను సృష్టింపఁబడి
మాయనుబెనుపొందికడకు మాయాజగతిన్
మాయావర్తభ్రమఁబడి
మాయంబైపోవు ఘటము మతిగాని సుబుద్ధీ !

క॥ మరియాద లేనికుజనుల
దరిఁజేరకు భృత్యజనుల దయఁగనుగొనుమీ
గురిలేనివారిఁ గూడకు
సిరిచెడి చుట్టములఁజేరఁ జేటు సుబుద్ధీ! 60

క॥ ధరణీసురులకుఁ దాపస
వరులకు హరిభక్తులకు నవంచితవిద్యా
దరులకు గురులకును భిష
గ్వరులకు నెదు రెందు నాడవలదు సుబుద్ధీ!

క॥ కడులేమిడియం దున్నను
జెడుకాలముచేత నొరుల సేవలనున్నన్
నడుకానలందు నున్నను
విడఁగూడదు కన్నవారి వినవె సుబుద్ధీ! 62

క॥ మఱఁదుల బావల యెదుటను
బిరబిర వెసఁదిరుగరాదు బిడియ మడంగన్
బొరిఁ బొరుగువారికొంపల
కరుగకు పనిపాటలేక యరసి సుబుద్ధీ! 64

క॥ మతినిల్పి నిముసమైనను
పతిభక్తిని దాసితోడ భగవద్భక్తిన్
సతతం బొనరింపఁగ నా
కతముననె కైవల్యమబ్బఁగలదు సుబుద్ధీ! 64

క॥ మగఁడొకవిటరాలి నిలఁగా
దగిలియుఁ దావకసుఖంబుఁ దలఁపకయున్నన్
దగవా మీకిదియని పెను
వగఁగొని పగఁ దగవహింపవలదు సుబుద్ధీ!

క॥ కొట్టినఁ దిట్టిన మగఁడీక
గట్టిగ మెడఁబట్టిగెంటి కాదనినను దాఁ
బుట్టింటి కేగ కెప్పుడు
మెట్టిన నట్టింట నుంట మేలు సుబుద్ధీ! 66

క॥ మగఁడింటలేనియప్పుడు
ఖగవాహనుఁడైన భువనకరుఁడగు సాక్షా
ద్భగవంతుఁడైన వచ్చిన
తెగఁబడి మాటాడరాదు తెలివ సుబుద్ధీ!

క॥ పరపురుషులతోఁ జుట్టపు
వరుసఁగలిగినట్టి మెట్టివారలతోడన్
మఱఁదులతో బావలతో
సరసము లాడంగ సతికిఁ జనదు సుబుద్ధీ! 68

క॥ నిప్పచ్చరమున భర్తను
దెప్పకు నీయింటిగుట్టు తెర వెవ్వరికిన్
జెప్పకు పలుపురు వలదను
నెప్పని నేసియును జేయ కెపుడు సుబుద్ధీ! 69

క॥ బ్రతుకుదినంబుల మోక్షపు
గతులన్ వెదుకంగవలయుఁగానీ పటుజీ
వితమును వితంజేయ నధో
గతిపా లగునమ్మ కాంత కడకు సుబుద్ధీ! 70

క॥ తిట్టినఁ దిట్టక, కొట్టినఁ
గొట్టక కోపంబుఁగొనినఁ గోపముఁగొనఁబో,
కెట్టి కలంతలనైనను
నెట్టెదుకొని యోర్చియుండుటొప్పు సుబుద్ధీ!

క॥ కాసుల కూసరమైనను
గ్రాసంబున కింతగంజి కలుగకయున్నన్
వేసరమైనను బరులకు
దాసీతనమొప్పుకొనుట తప్పు సుబుద్ధీ! 72

క॥ దొరసానివైనఁ గానీ
నరపతితలఁదాల్చు వలపువారివె కానీ
మరుతరుణివె కానీ మఱి
పరులన్ బరుసంబు లాడవలదు సుబుద్ధీ! 73

క॥ బ్రతికిననాల్గుదినంబులు
పతిభక్తియు సంతతంబు పరమేశుపదా
హితభక్తియుఁగొని యిల స
ద్గతి వెదుకన్ వలయు మమతగలిగి సుబుద్ధీ!

క॥ చచ్చినమీఁదటఁ దనతోఁ
బుచ్చినవస్తువులఁ దరలఁబోవదు జీవం
బిచ్చో నున్నపుడే కడు
నచ్చుపుధర్మములఁ జేయనగును సుబుద్ధీ! 75

క॥ తలఁపులలో వలపులలోఁ
గలలోపలనైన నొరునిఁ గననేరనియా
కలికిని జిలుకలకొలికిని
బలుకులజవరా లనంగఁ బరగు సుబుద్ధీ! 76

క॥ గురువరుల సర్వవిద్యా
ద్వరుల ధరామరుల దైవతస్తుతినిష్ఠా
పరుల సుహృద్వరుల నిలఁ
బరమాదరమునను గాంచఁబాడి సుబుద్ధీ! 77

క॥ గరువమున సకలకీర్తులు
దరుగును బంధువులు హితులు దారెల్లరు నొ
ల్లరు విభవ మంతయుం జెడు
సిరిచెడు మదిచెడుఁ గొలంబుచెడును సుబుద్ధీ!

క॥ వినయమున నెల్లవారికి
ఘనతయు నిఖలప్రజాభిగౌరవ మబ్బుఁ
ధనకనకైశ్వర్యోన్నతు
లనయము వర్ధిల్లు శుభము లలరు సుబుద్ధీ!

క॥ పరగృహాములందుఁ బండుట
పరజనతతితోడ మిగుల భాషించుటయున్
బరసతులతప్పు లెన్నుట
తెలివకుఁదగనట్టి తెలివు తెలియు సుబుద్ధీ!

క॥ పడిపడి రాళ్ళకుమ్రొక్కిన
వడివడిఁ దీర్థాటనంబు వదలకగొనినన్
గడియించినట్టిపాతక
ముడుగునె హరిభజన లేకయున్న సుబుద్ధీ!

క॥ చక్కదనం బున్నదియని
క్రొక్కరపను లాచరించి కులమంతటి క
మ్మక్కా దుశ్శాసనముం
జెక్కించుటకన్న లేను చెడుగు సుబుద్ధీ! 82

క॥ పిల్లల గుణాగుణంబులు
తల్లులవలన న్వెలుంగఁదగుఁగాన నిలన్
బిల్లతనంబుననుండియు
నల్లాపములే వచింపఁజనును సుబుద్ధీ! 83

క॥ గారాబంబున బిడ్డల
నూరూరికిఁ గొంపకొంప కూరక యెపుడున్
జేరఁగనీయకు మావిధి
వారికి దుర్గుణము పట్టువడును సుబుద్ధీ! 84

క॥ పెద్దలఁ గనికరమునఁ గని
యొద్దిక బుద్ధులనుగఱపు నొజ్జలనెల్లన్
దద్దయు సేవించినచో
నద్దిర పరలక్ష్మి యది యటంద్రు సుబుద్ధీ!

క॥ చదువుము సద్గతులిచ్చెడి
చదువుల నీసుతుల సుతల సద్విహితగతిన్
జదివించుము మది నెంచిన
చదువే సద్గతికి నావసథము సుబుద్ధీ! 86

క॥ ఇమ్మగు సొమ్ములతో ఝుం
ఝుమ్మన దంధణమనన్ బజారుల వెంటన్
గ్రుమ్మరెడు నాఁడుదానిన్
ద్రిమ్మరిలో త్తనుచు జనము దెగడు సుబుద్ధీ!

క॥ కోపము ఘోరంపువిప
ద్ధూపము దుర్భరదురంత దుష్కృతయుతమౌ
కూపము గావున సుజనుఁడు
కోపము విడవలయు ముక్తికొఱకు సుబుద్ధీ!

క॥ శాంతము విలసత్కార్యా
శాంతము చిరసౌఖ్యసద్యశఃప్రాంతము వే
దాంతోదంతము శాంతము
శాంతంబే యుండవలయు సతికి సుబుద్ధీ! 89

క॥ చిన్నలలోఁ బెద్దలలోఁ
దన్ను దయుం బెనుచునట్టి తలిదండ్రులలో
నన్నలలోఁ దమ్ములలో
మన్నడిగాఁ దిరుగుచున్కి మతము సుబుద్ధీ!

క॥ అందఱు బందుగు లగుదు రె?
క్రందున సుఖమందు నష్టకష్టములందుఁ
బొందుగ విడువక ప్రోచెడి
బందుగుఁడే బందుగుండు వరగ సుబుద్ధీ! 91

క॥ ఎంచకు మితరుల మది మ
న్నించకు మెదురాడ సుతులనేని; ధర■యా
చించకు నీచాత్ముల సా
ధించకు పగఁగాని విరోధినేని సుబుద్ధీ! 92

క॥ తలిదండ్రు లర్థకాంతను
ఖలునకొ జారునకొ జీర్ణకాయునకో ని
న్నలవడ నీఁబూనినచో
వలదని కడఁద్రోయు వెఱువవలదు సుబుద్ధీ!

క॥ వంతయొ సంతసమో తన
కాంతునితోఁ బాటు భావికముఁగాని మనునా
కాంతామణిచూడామణి
నింతులమేల్బంతిఁగాఁగ నెంతు సుబుద్ధీ! 94

క॥ కళలే తోడవులు కవులకుఁ
గళలే తోడవులు సుగాయకప్రవరులకున్
గళలే తోడవులు సతికిన్
గళలే భోగినికిఁ దోడవుగాదె సుబుద్ధీ! 95

క॥ ధనమున్నయప్పు డెల్లరుఁ
దనవారలె రాజుగూడఁ దనసేవకుఁడే
మునులైనఁ దనకు హితులే
ధనమాహాత్మ్యంబుఁ జెప్పఁదరమె సుబుద్ధీ!

క॥ కాన ధనార్జన మెల్లరుఁ
బూనవలెన్ బూనిఫలముఁ బొందినమీఁదన్
లేనిత్యుధార్తుల యార్తిని
మానుపవలె నదియె పుణ్యమతము సుబుద్ధీ!

క॥ అంతఃపురంబునం గల
మంతన మేలాటిమాన్యమానినికైనన్
జింతాకంత వచించినఁ
గాంతకుఁ బ్రాణాంతకంబుగాదె సుబుద్ధీ! 98

క॥ వెఱువవలెన్ దనమగనికి
మఱందులకును బావలకును మామలకెపుడున్
వెఱువవలెఁ గన్నవారికి
వెఱువవలెన్ గర్వపడక వెలఁది సుబుద్ధీ! 99

క॥ తనదేహముఁ దనగేహము
ననయముఁ బరిశుభ్రపఱుపనగు నెల్లరకున్
దనుశుభ్రత గృహశుభ్రత
ఘనమే ఘనమనెద రెల్లఘనులు సుబుద్ధీ!

క॥ పతిభక్తి దైవభక్తియు
నతిథులయెడభక్తి సూనృతాసక్తి లస
త్ప్రతిగల్గుసతికి వేరగు
వ్రతజపతపములు మరేలవలయు సుబుద్ధీ!

క॥ బాలికలకు బాలురకును
దేలికగాఁ దెలియఁ జేట తెలుఁగుపదంబుల్
గ్రాలెడుపద్యంబుల నే
చాలగ వ్రాసితిని దీనిఁజదువు సుబుద్ధీ! 102

క॥ మతిమంతుల హృద్గతమై
క్షితి సాధ్వీతిలకములకు శ్రీకరమై శా
శ్వతమై మత్కృతమగునీ
శతకము వర్ధిలునుగాత సతము సుబుద్ధీ! 103

సు బు ద్ధి శ త క ము
స ం పూ ర్ణ ము.

క్రొత్తనాటకము !　　　　అచ్చులోనున్నది !!

# మణిమంజరి.



ఇది ఖాసీం ఆలీషాచే నురుదూలోఁ గల యొకానొక విచిత్రమగు కథననుసరించి యారంకముల నాటకముగా రచింపఁబడి బహుపండిత జనులచేతఁ బొగడ్తఁగాంచి ప్రదర్శనానుకూలమై రచనావిధానముల హృదయంగమమై యలరారుచున్నది. గుంటూరు జిల్లా బోర్డు సభ్యులును రసిక జనశిఖామణులును, నిడుబ్రోలు గ్రామణులును నగు శ్రీయుత పాములపాటి వెంకటకృష్ణయ్య చౌదరిగారికి నంకితమీయఁబడినది. కొలఁది దినములలో వెలువడఁగలదు.

గుంటూరు కన్యకా ముద్రాలయమందు ముద్రితము.

సిద్ధముగ నున్నది!　　　　త్వరపడుండు!!

# కొండవీటిచరిత్ర

గ్రంథకర్త,

ఖాసిం ఆలీ షా

గారపాడు, గుంటూరు తా॥

ఈ గ్రంథమునందు రెడ్డిప్రభువులయొక్కయు మహమ్మదీయప్రభువులయొక్కయుఁ బరిపాలనము సవిశేషముగ వర్ణింపఁబడినది. కాన నభిమానులెల్లరుఁ గొనఁగలరని విన్నపము.

ప్రతి ఒకటికి వెల రు. **0-8-0** లు.

కన్యకా ముద్రాక్షరశాల, గుంటూరు.